

అథర్వవేదీయ

# శాన్తి సూక్తము

( వైజ్ఞానిక వివరణతో )



మంత్రకర్త :

**ఓ3మ్ నామక సర్వవ్యాపక సర్వేశ్వరుడు**

వైజ్ఞానిక వివరణ :


**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)



ప్రచురణ - వితరణ :

**ఆర్యసమాజము - సీతాఫలమండి**

మెయిన్ రోడ్డు, సీతాఫలమండి,

సికింద్రాబాద్ - 500 061. (తెలంగాణ)

ఫోన : 27071816, సెల్ : 9133134156



# ప్రార్థన

ఋషిః - దీర్ఘ తమాః  దేవత - ఆత్మ

ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥

- యజుర్వేదం (40-16)

హే అగ్నే! ప్రకాశ స్వరూప పరమేశ్వరా! మమ్ములను ధన జ్ఞాన ప్రాప్తికై సుమార్గమున నడుపుము. ఓ దేవా సమస్త కర్మలకు సాక్షివి నీవే. మా నుండి కుటిలమైన పాపాచరణమును దూరము చేయుము. మేము శ్రద్ధా భక్తులతో నీకు నమస్కారము చేయుదుము.

O Divine, Lustrous Benevolent God, most ample, respectful adoration do we bring Thee. Thou art All knowing. Remove from us the sin that leads us astray. Lead us through virtuous path to riches, happiness and all sorts of wisdom.



అథర్వవేదీయ

# శాన్తి సూక్తము

**( వైజ్ఞానిక వివరణతో )**



మంత్రకర్త :

**ఓ3మ్ నామక సర్వవ్యాపక సర్వేశ్వరుడు**


వైజ్ఞానిక వివరణ :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)



ప్రచురణ - వితరణ :

**ఆర్యసమాజము - సీతాఫలమండి**

మెయిన్ రోడ్డు, సీతాఫలమండి,

సికింద్రాబాద్ - 500 061. (తెలంగాణ)

ఫోన : 27071816, సెల్ : 9133134156

వైదిక గ్రంథమాల : 1
అథర్వవేదీయ
**శాంతి సూక్తము**
(వైజ్ఞానిక వివరణతో)
ప్రథమ ముద్రణ ప్రతులు : 2000


సృష్టి సంవత్సరము (సంధిసహితం) : 197,29 49, 115

విక్రమాబ్దము : 2071
దయానందాబ్దము : 190
శ్రీ జయ నామ సంవత్సర భాద్రపద శు॥ షష్ఠి
(తేది 31-08-2014)

మూల్యము : శాంతి ప్రసాదము

ప్రతులకు :
**ఆర్యసమాజము - సీతాఫలమండి,**
మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి,
సికింద్రాబాద్, తెలంగాణ - 500 061.
ఫోన్ నెం. 040-27071816, 9133134156

డి.టి.పి. & ప్రింటింగ్ :
**విక్రాంత్ ప్రింట్ హౌస్,**
వారాసిగూడ, సికింద్రాబాద్.
ఫోన్ : 9705085608.



## తొలిపలుకులు (Foreword)

మనిషికి సుఖంతోబాటు శాంతికూడా చాలా అవసరం. కొన్ని సందర్భాలలో సుఖంకన్నా శాంతియే మిన్న అనిపిస్తుంది. ఈశునిచే (సర్వనియామకునిచే) ఈ సృష్టి అంతా వ్యాపించబడివుంది కనుక సృష్టిలోని పదార్థాలన్నీ చాలావరకు 99.9% శాంతంగానే ఉన్నాయి. ప్రాకృతిక ఉపద్రవాలు అరుదుగానే జరుగుతూ ఉంటాయి. వాటికి కూడా చాలావరకు మానవ తప్పిదాలే కారణమంటున్నారు వైజ్ఞానికులు. ఆ తప్పిదాలను తెలుసుకొని వాటిని చెయ్యకుండా ఉండటమే మన మొదటి కర్తవ్యం. అనంతరమే శాంతి మంత్రాలతో ప్రార్థన చెయ్యాలి. ఇక మానసిక అశాంతి తొలగాలంటే - మనలోని రాగద్వేషాలు, కామక్రోధాలు నశించాలి. అందుకు ఆత్మజ్ఞానం, యోగాభ్యాసం అనివార్యం. మిగిలినవన్నీ తత్కాలిక ఉపశమనాలు మాత్రమే.

నాలుగు సంవత్సరాలుగా నా జీర్ణశక్తి క్రమంగా తగ్గిపోతున్నది. ఏ మందులూ పని చేయటంలేదు. దానితో శారీరకశక్తి బాగా దిగజారి పోతున్నది. అందుచే క్రొత్తగా పుస్తకాలు ఏవీ వ్రాయలేక పోతున్నాను. అంతకు ముందు వ్రాసిన పుస్తకాల ముద్రణప్రూఫ్ చూడటమే పెనుభారంగా ఉంది. ఆ స్థితిలో నా శరీరం ఉండగా రెండు సంవత్సరాల క్రితం మా సమాజ మిత్రులు శ్రీ డి. నరసయ్య (ప్రస్తుత కార్యదర్శి), ఉప్పల యాదగిరి (పూర్వ కార్యదర్శి) గార్లు నన్ను కలుసుకోవటానికి భువనగిరి ఆశ్రమానికి వచ్చారు. సీతాఫలమండి ఆర్యసమాజం నుండి ప్రతినెల ఒక కరపత్రం ముద్రించి ఉచితంగా వితరణ చేయాలని సంకల్పించినాము అందుకు మీ సహకారం కావాలని కోరారు. మీరు కరపత్రాలు వ్రాసి యిస్తే చాలు. ప్రూఫ్‌లు చూసి, ముద్రణ చేయించి, వితరణ చేసే పనంతా మేము చూసుకుంటామన్నారు. ప్రూఫ్ రీడింగు బాధ్యత శ్రీ డి. గంగాధర్ గారికి అప్పగించారు. నాకుకూడా బాగా వైదికధర్మ ప్రచారం చెయ్యాలని కోరిక. శారీరక బలహీనతవల్ల తిరుగుతూ ప్రవచనాలు చెప్పేపని చేయలేక పోయాను. పుస్తకాల ద్వారానే కొంత ప్రచారంచేశాను. ఆ పని కూడా యిప్పుడు చేయలేకపోతున్నాను. కనుక ఎట్లో కొన్ని నెలలకు వ్రాసియిస్తే ఆ తరువాత

ఎవరైనా పండితులు వ్రాసి యిస్తారులే అనుకుని "సరే" నన్నాను. ఆ క్రమంలోనే రెండు సంవత్సరాలుగా నా రచనలే కరపత్రాలుగా వస్తున్నాయి. ఎవరైనా విద్వాంసులు ఈ భారం తీసుకుంటే బాగుంటుందని నా విన్నపం.

ఒక సంవత్సరం క్రిందట నేను సీతాఫలమండికి రావటం జరిగింది. ఆ సందర్భంలో సమాజ కార్యదర్శి శ్రీ డి. నర్సయ్యగారు "మీరు పురుషసూక్తానికి వ్యాఖ్యానం వ్రాసినట్లు శాంతిసూక్తానికి కూడా వైజ్ఞానికంగా వ్యాఖ్య వ్రాస్తే చాలా బాగుంటుంది. ఎక్కువ ఉపయోగపడుతుంది. మీరు వ్రాసియిస్తే చాలు మిగతావన్నీ మేము చూసుకుంటా" మన్నారు. ప్రయత్నించి చూస్తానన్నాను. అది ఎట్లాగో పూర్తి చేశాను. నేను పురుషసూక్తానికి అన్వయార్థంగా కాక వాక్యార్థాలుగా వ్రాశాను. అట్లే దీనికి కూడా వాక్యార్థాలుగా వ్రాయమని కోరారు. ముందు ఈ పుస్తకం చదివి అర్థం చేసుకుంటే శాంతి సూక్త మంత్రపఠనం చేసేటప్పుడు సామాన్యులకు అర్థభావన కలుగుతుంది. అర్థభావనతో పఠిస్తే మనస్సు లగ్నం అవుతుంది. మనస్సు లగ్నమైతే శాంతి కలుగుతుంది. తృప్తి కలుగుతుంది. కనుక ఆ పద్ధతిలోనే ఈ శాంతిసూక్తానికి వాక్యార్థాలుగా వ్రాశాను. నేను వ్యాకరణం చదువుకున్న విద్యాంసుడనుకాను. ఇద్దరు ముగ్గురు విద్వాంసులు వ్రాసిన భాష్యాలు చదివి ఎలా చెబితే సామాన్యులకు అర్థమౌతుందోనని ఆలోచించి ఈ వ్యాఖ్య వ్రాశాను. విద్వాంసులు ఇందులో ఏవైనా దోషాలుంటే, తెలిపిన పునరాలోచించి ద్వితీయ ముద్రణలో సవరించుకోగలను.

ఆర్యులు అప్పుడప్పుడు, ముఖ్యంగా విచారకర సందర్భాలలో శాంతిహోమాలు చేస్తూవుంటారు. అది చూసిన పౌరాణిక భక్తులుకూడా మా యింట్లో శాంతిహోమం చెయ్యమని కోరుతూ వుంటారు. అట్టివారు ముందుగా ఈ పుస్తకం చదివితే అర్థభావనతో మంత్రపఠనం చెయ్యగలుగుతారని నా నమ్మకం. ఈ పుస్తకాన్ని తొందరలోనే ప్రచురిస్తున్న మా సీతాఫలమండి ఆర్యసమాజ కార్యవర్గానికి నా హృదయపూర్వక ధన్యవాదములు. అందరికి శుభాకాంక్షలు.

అందరి శ్రేయాభిలాషి

సుబ్బారావు

(డా. కోడూరి సుబ్బారావు)

వైదిక వానప్రస్థ సాధకాశ్రమం,
హనుమాపురం హైవేరోడ్డు,
భువనగిరి, తెలంగాణ.



# ప్రకాశకీయము

నేటి యాంత్రిక జీవనములోనూ శాన్తి – కాముకులు జడ చేతన దేవతల నుండి అపాయములు కలుగకుండా పరమేశ్వరుని ప్రార్థిస్తూ శాన్తి యజ్ఞము చేయుచున్నారు. ఈ యజ్ఞమునందు అథర్వ వేదము నందలి శాన్తి సూక్త – మంత్ర పఠనముతో ఆహుతులిచ్చు చున్నారు. కాని ఈ మంత్రాలలో ఇమిడి యున్న విషయాలను మాత్రము ఎరుగరు. అర్థసహిత ఆహుతులే పూర్తి ఫలితాన్నీయగలవు. ఇది దృష్టిలో నుంచుకొని, మేము సుమ్నార్థి డా. కోడూరి సుబ్బారావు గారిని, సామాన్యులందరికి అర్థమగు నటుల ఈ శాన్తి సూక్తముపై వ్యాఖ్య వ్రాయుమని కోరాము. వారు వెంటనే ఆరోగ్యము సహకరించకున్ననూ "వైజానిక వ్యాఖ్య" రాసి మా కిచ్చారు. ఈ వ్యాఖ్యలో ప్రతి మంత్రానికి, వ్యాఖ్యార్థము, సరళార్థము వైజ్ఞానిక వివరణ మరియు ఆంగ్ల అనువాదము చక్కగా సరళమైన భాషలో జనులందరికి బోధపడునట్లు వివరించారు. మా సభ్యుడు శ్రీ డి. గంగాధర్ గారు ప్రూఫ్ రీడింగు చేసి అచ్చుతప్పుల సవరించారు.

ఈ చిన్ని పుస్తకము మేము కేవలము ప్రచారార్థముకై ప్రచురించి ఉచితంగా వితరణ చేయుచున్నాము. ఇదియునుగాక మా సమాజము తరఫున ప్రతినెల ఒక కరపత్రము ముద్రించి పాఠకుల కందరికి ఉచితం గానే పోస్టుద్వార పంపుచున్నాము. ఇప్పటి వరకు అనగా ఆగష్టు 2014 వరకు 23 కరపత్రాలు ప్రచురించి పంపినాము. ఈ కరపత్రాలు వ్యాసకర్త కూడా డా. సుబ్బారావు గారే. ఈ కర పత్రముల ద్వార ఆధ్యాత్మిక విషయాలు వైజ్ఞానపరంగా జనులందరికి అవగాహన కలుగ చేయుటయే మా ఉద్దేశ్యము. ఈ విషయములో మాకు పాఠకులనుండి మంచి స్పందన లభించు చున్నది.

ఈ సందర్భములో సుమ్నార్థి డా. కోడూరి సుబ్బారావు గారి గురించి కొన్ని వాక్యములు వ్రాయుట మా ధర్మము. వారు 1971 లో స్వర్గీయ

రామచంద్ర రావు మహేంద్రకర్ ప్రోత్సాహముతో ఆర్యసమాజము సీతాఫల్‌మండికి రావటము జరిగినది. గురుదేవులు పం॥ గోపదేవశాస్త్రి గారి ప్రవచనములు మరియు స్వాధ్యాయముతో అచిర కాలములోనే ప్రచారకునిగా ఎదిగి సమాజ కార్యక్రమాలు సంస్కారాలు, ప్రచారాలు చేశారు. మా పాఠశాల వైదిక విద్యాలయము హై స్కూల్‌కు కరెస్పాండెంటుగా కూడా సేవలనందించారు. సామాజిక కార్యక్రమాలలో నిమగ్నులై వుండి కూడ వీరు హోమియో విద్య నభ్యసించి దయానంద హోమియో ధర్మార్థ చికిత్సాలయము, ఆర్య సమాజము, సీతాఫల్‌మండి ద్వారా అతి తక్కువ రుసుముతో, దీర్ఘకాలిక రుగ్మతలను దూరము చేసి జనుల మన్ననల నందుకున్నారు. ఆరోగ్య సహకారము తగ్గుటవలన ప్రచార కార్యక్రమాలను తగ్గించి, తాను ఆర్జించిన వేద జ్ఞానాన్ని రచనల ద్వార ప్రజల కందిస్తున్నారు. దాదాపు 30 సంవత్సరముల నుండి, నలుబదికి పైగా రచనలు చేసినారు. వీరి భాష చాల సరళము. ఆధ్యాత్మిక విషయాలను విజ్ఞాన పరంగా నిరూపించి అందరికి అర్థమయ్యేలా వ్రాయటం వీరి రచనా విశిష్టత. వీరు తనకు లభించిన పారితోషికాలను కూడా దాన ధర్మాలకే ఉపయోగించారు.

డా. సుబ్బారావు గారు సమాజానికి ఎంతో సేవ చేయుచున్నారు. వారికి పరమ పిత పరమేశ్వరుడు దీర్ఘ ఆయురారోగ్యములు ప్రసాదించాలని కోరుచున్నాము.

యాజమాన్యం

**ఆర్య సమాజము, సీతాఫల్‌మండి,**

సికింద్రాబాద్ - 61.

# శాంతి సూక్తము

శాంతి పదం వైదిక వ్యాకరణాన్ననుసరించి "శము – ఉపశమే" అనే ధాతువుతో ఏర్పడుతుంది. కనుక శాంతి అంటే ఉపశమనం (Relief) అని అర్థం. మన శరీరాలు పంచభూతాలతో – పృథివీ, జలము, అగ్ని, వాయువు, ఆకాశాలతో నిర్మింపబడ్డాయి. వాటితోనే పెరిగి పెద్దవై అందులోనే జీవిస్తున్నాయి. సూర్య చంద్ర నక్షత్రాది గ్రహగోళాలు, ఉల్కలు తోకచుక్కలు. భూమిపైనున్న నదులు పర్వతాలు సముద్రాలు, మేఘాలు మెరుపులు పిడుగులు మొదలైన ప్రాకృతిక దేవతల సహకారంతో మన జీవనం సాగుతున్నది. కనుక అవన్నీ మాకు సుఖ శాంతులను ప్రసాదించాలని కోరుకోవటంలో తప్పులేదు. కాని ప్రార్థనతోబాటు మనవంతు ప్రయత్నం కూడా చెయ్యాలి. ఆ యా ప్రాకృతిక దేవతలను గూర్చిన జ్ఞానాన్ని పెంచుకుంటూ వాటి సమతుల్యతను చెడకొట్టకుండా మనం జీవించాలి. శారీరిక సామాజిక ఆత్మోన్నతులను సాధించాలి. ఈ జ్ఞానమంతా మనకు సృష్టికర్త యిచ్చిన వేదం నుండి లభిస్తుంది. దానిలోనే భ్రమ ప్రమాదులు లేని విశుద్ధ విజ్ఞానం ఉంది.

సృష్ట్యాదిలో నలుగురు ఋషుల హృదయాలలో సృష్టికర్త నాలుగు వేదాలను ప్రకాశపరచాడు. అగ్నినామక ఋషికి ఋగ్వేదాన్ని, వాయునామక ఋషికి యజుర్వేదాన్ని, ఆదిత్య నామక ఋషికి సామవేదాన్ని, అంగీరసునకు అథర్వవేదాన్ని యిచ్చాడు. అప్పటినుండి ఇప్పటివరకు ఆ నాలుగు వేదాలను గురుశిష్యపరంపరగా రక్షిస్తూ మన పూర్వులు కాపాడారు. ఋగ్వేదంలో పదార్థజ్ఞానం ఉంది. సృష్టిలోని పదార్థాల గుణగణాలు బీజరూపంలో తెలుపబడ్డాయి. యజుర్వేదం కర్మకాండను బోధిస్తుంది. మనం ఏ ఏ కర్మలు చేస్తే ఉన్నతి కలుగుతుందో ఏ ఏ కర్మలు పాపకర్మలో – చెయ్యకూడనివో బోధిస్తుంది. సామవేదం ఉపాసనను వివరిస్తుంది. అంటే – అంతర్ముఖులమై మన అసలు స్వరూపాన్నీ, సర్వవ్యాపక సర్వేశ్వరుని యదార్థ స్వరూపాన్ని సాక్షాత్కరింప చేసుకోవటానికి కావలసిన యోగ విజ్ఞానాన్ని బోధిస్తుంది. అథర్వవేదం విజ్ఞాన కాండను వివరిస్తుంది. సహజంగా లభించే వనరులతో విశేష సుఖాలను పొందటానికి కావలసిన గృహ వాహన యంత్రాదుల నిర్మాణాన్ని, ఔషధాల నిర్మాణాన్ని తెలుపుతుంది. ఈ అథర్వవేదంలో మరెన్నో విజ్ఞాన విషయాలున్నాయి. దీనిలోనే మనం తెలుసుకోబోయే శాంతిసూక్తం ఉంది. శాంతి కలగాలంటే మనం ఏమి

చెయ్యాలో ఈ సూక్తంలో సూచన ప్రాయంగా చెప్పబడింది.

ఈ క్రింది శాంతిసూక్తం అథర్వవేద 19వ కాండలోని 9వ సూక్తం. ఈ సూక్త మంత్రాలన్నిటికి ఋషి-బ్రహ్మా:, దేవత - శాంతి:, ఛందస్సులు, స్వరాలు వేరు వేరుగా ఉన్నాయి. ఋషి అంటే యోగాభ్యాసం ద్వారా సమాధిస్థితిలోనికి వెళ్లి ఈ మంత్రార్థాలను దర్శించినవారు. పరమేశ్వరుని ద్వారా వాటి అసలు అర్థాలను తెలుసుకున్నవారని అర్థం. దేవత అంటే ఆ మంత్రాలలో ఉపదేశింపబడిన విద్య - Subject of the Mantra .

**ఓం శాన్తా ద్యౌః శాన్తా పృథివీ శాన్త మిదముర్వ్వ_న్తరిక్షమ్ ।**
**శాన్తా ఉదన్వతీరాపః శాన్తా నః సన్త్వోషధీః ॥... (1)**

వాక్యార్థం :- ఓం = సర్వవ్యాపక సర్వ సంరక్షక సర్వేశ్వరా !

శాన్తా ద్యౌః శాన్తా పృథివీ (అస్తు) = నీ కృప వలన ద్యులోక పృథివీ లోకాలు మాకు శాంతి నిచ్చును గాక !

శాన్తమ్ + ఇదమ్ + ఉరు + అన్తరిక్షమ్ = ఈ విశాల అంతరిక్షం మాకు శాంతి నిచ్చును గాక !

శాన్తా ఉదన్వతీః + ఆపః = ఉత్తమ జలములతో ప్రవహించు నదీనదములు, విశాల సముద్రములు మాకు శాంతిని కలిగించును గాక !

శాన్తా నః సన్తు + ఓషధీః = వివిధ రకాల ధాన్యాలు, పప్పులు, ఓషధులు మాకు సుఖశాంతుల నిచ్చును గాక !

సరళార్థం: ఓ శాంతిదాయక పరమపిత పరమేశ్వరా! నీ కృపవలన ద్యు పృథివీ అంతరిక్షాలు మాకు శాంతిదాయకము లగును గాక ! ఉత్తమ జలములతో ప్రవహించు నదీనదములు, సముద్రములు, వివిధ ఆహారపంటలు, సోమలతాది ఓషధులు మాకు సుఖశాంతుల నిచ్చునవి అగునుగాక !

May for us the heavenly region be peaceable, may the earth be peaceable, may this vast firmament be peaceable, may the waters of ocean be peaceable and may the herbarious plants be peaceable.

<u>వైజ్ఞానిక వివరణ :</u>

పై మంత్రంలోని మొదటి 'ఓ3మ్' పదము మంత్రభాగం కాదు. అయినప్పటికీ, సర్వవ్యాపక సర్వేశ్వరుని ఓ3మ్ నామముతో స్మరించి వేదపాఠాన్ని ప్రారంభించటం మన ప్రాచీన సాంప్రదాయం. వేద విజ్ఞాన ప్రదాతయు అతడే కదా! ఓం పదము "అవ - రక్షణ, గతి, కాంతి, ప్రీతి...." అను 23 అర్థాలుగల పెద్ద సంస్కృత ధాతువుతో (Root తో ) నిర్మించబడుతుంది. అందుచే ఆ అర్థాలన్నీ ఓం లో యిమిడి ఉంటాయి. ఇంతేగాక ఈ పదము అ+ఉ+మ్‌లు కలిసియు ఏర్పడుతుంది. ఈ మూటిలోను మరెన్నో అర్థాలున్నాయి. మరొక విశేష మేమంటే ఈ పదం జీవునకు, దేవునకు ఉండే సంబంధాన్ని - సంరక్షక సంరక్షిత సంబంధాన్ని తెలుపుతుంది. దేవుడు మనకు సంరక్షకుడు, మనం ఆయన రక్షణలో ఉన్నవారము. ఉచ్ఛస్వరంతో ఓం నామాన్ని జపిస్తే ఎన్నో వైజ్ఞానిక ప్రయోజనాలున్నాయి. ఆ జపం శరీరాన్ని, మనస్సును, ఆత్మను ఆరోగ్యవంతం చేస్తుంది. మెదడులోని ఆల్ఫా, బీటా, తీటా, డెల్టా తరంగాలను సరిదిద్ది గొప్ప మానసిక ప్రశాంతతను కలిగిస్తుంది. వివరంగా తెలుసుకొనగోరువారు నా రచన "గాయత్రీ విజ్ఞానం " చదువగోరుచున్నాను.

విశ్వంలో లోకాలు అనేకానేకం ఉన్నాయి. వాటినన్నిటిని 3 లోకాలుగా విభజించి వ్యవహరిస్తుంది వేదం. ఈ మంత్రంలో ఆ మూడులోకాలు - ద్యులోక పృథివీ అంతరిక్షాలు మాకు శాంతిదాయకాలు కావాలని ప్రార్థించబడింది. పృథివిపై ఎక్కువభాగం ఆక్రమించి ఉన్నజలము, నేలపై విస్తరించి ఉన్న వృక్షజాతులు మాకు సుఖ శాంతులను కలిగించాలని కోరుకోవటం జరిగింది.

**ఓం శాన్తాని పూర్వరూపాణి శాన్తం నో అస్తు కృతాకృతమ్ ।**
**శాన్తం భూతం చ భవ్యం చ సర్వమేవ శమస్తు నః ॥ ...... (2)**

<u>వాక్యార్థం</u> :- <u>శాన్తాని పూర్వ రూపాణి</u> = మే మొనర్చు కర్మలకు పూర్వరూపములైన చిత్త సంస్కారాలు జ్ఞానంచే పరిశుద్ధములై శాంతి నిచ్చునవి అగును గాక !
<u>శాన్తం నః + అస్తు కృతా + అకృతమ్</u> = కార్యరూపమును ధరించిన కర్మలు, ధరించబోవు ఆలోచనలు మాకు శాంతి నిచ్చునవియే అగును గాక !

శాన్తం భూతం చ భవ్యం చ = గతించిన కాలంలో మేము చేసిన కర్మలు, భవిష్యత్తులో మేము చేయబోవు కర్మలు శాంతి దాయకములే అగును గాక !

సర్వమ్ + ఏవ + శమ్ + అస్తు నః = అవి ఇవి అననేల మా సర్వకర్మలు మాకు శాంతి నిచ్చునవియే అగును గాక !

సరళార్థం :- అంతర్యామివైన ఓ పరమేశ్వరా ! ఓ న్యాయకారీ ! మేము చేయు కర్మలకు పూర్వరూపములైన మా చిత్త సంస్కారాలు శాంతి నిచ్చునవి యగును గాక! మా కృతాకృతకర్మలు (చేసినవి, చేయబోవునవి) శాంతి దాయకములే అగును గాక. భూత భవిష్యత్ కాలములు మాకు శాంతి నిచ్చును గాక. నీ కృపవలన సర్వము శాంతిదాయకమే అగును గాక.

May be free from disturbance the first symptoms and may be free from all agitations whatever has been and whatever is to be done by us. May be the past free from agitation and also the future and this every thing be peaceful to us.

వైజ్ఞానిక వివరణ :- వైదిక తత్త్వశాస్త్రాలు దేవునివలె జీవుడు అనాది స్వరూపం అంటాయి. **'న జాయతే మ్రియతే వా కదాచిత్'** (భ.గీ. 2-20) - అది ఎప్పుడూ క్రొత్తగా పుట్టినదికాదు. ఎప్పటికిని మరణించదు. భూత భవిష్యత్ వర్తమాన కాలాలన్నిటిలోను అది ఉంటుంది. ఒక శరీరం జీర్ణమై మరణిస్తే మరియొక శరీరాన్ని ధరిస్తుంది. పూర్వ మానవశరీరంతో ఆ యా జీవులు చేసిన కర్మలను బట్టి 84 లక్షల జీవజాతులలో ఏదేని ఒక ప్రాణిగా పుట్టిస్తాడు దేవుడు. అంటే అట్టి శరీరాన్ని నిర్మించి అందులోనికి ఆ జీవుణ్ణి పంపుతాడు పరమేశ్వరుడు.

ఈ జీవ జాతులన్నిటిలోను మానవశరీరమే ఉత్తమ శరీరంగాను, కర్మయోనిగాను ఉంటుంది. కర్మయోని అంటే క్రొత్తగా కర్మలు చేసే జన్మ. ముఖ్యంగా మానవ శరీరంలో ఉన్న జీవాత్మ కర్మలు చేయకుండా ఒక్కక్షణం కూడా ఉండలేదు - **'న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠతి అకర్మకృత్'** - (భ.గీ. 3-5) అంటాడు యోగేశ్వర శ్రీకృష్ణుడు. శరీరాన్ని కట్టిపెట్టినా, వాక్కును కట్టిపెట్టినా, మనస్సును కట్టిపెట్టలేడు. అది ఏదో ఒకటి ఆలోచిస్తూనే ఉంటుంది. ఆ ఆలోచనలలో పరహిత భావన ఉంటే అది పుణ్యకర్మగాను, పరపీడన భావన ఉంటే అది పాపంగాను

లెక్కించ బడుతుంది. అంతేకాక, మనం మనోవాక్కాయాలతో చేసేకర్మలు మనస్సులో ఒక సంస్కారాన్ని కలిగిస్తాయి. వీటిని ఆధునిక మనోవిజ్ఞానం ఎన్‌గ్రామ్స్ (Engrams) అంటుంది. అవి కాలాంతరంలో ఈ జన్మలోగాని రాబోవు జన్మలో గాని ఫలితాలను కలిగిస్తాయి. అట్టి సంస్కారాలు మనస్సులో చాలా చాలా ఉంటాయి. అట్టి వాటిలో కొన్ని సంస్కారాలను అనుభవించటానికే ఒక జన్మ వస్తూవుంటుంది. దానిని 'ప్రారబ్ధం' అంటాయి శాస్త్రాలు. ఆ ప్రారబ్ధాన్ని బట్టే ఆ జీవుని ప్రవృత్తి ఉంటుంది. ఆ ప్రవృత్తిలో రాజస తామస ప్రవృత్తులు మరల మనచే పాపకర్మలు చేయిస్తాయి. అశాంతిని కలిగిస్తూ ఉంటాయి. అందుచే సదా మనం సాత్విక భావాలను తీసుకువస్తూ, రాజస తామస ప్రవృత్తులను అణచిపెడుతూ ఉండాలి. అందుకొరకే ఈ మంత్రం 'శాన్తాని పూర్వరూపాణి' అని సంకల్పం చెయ్యమంటున్నది.

"అకృత" కర్మలు అంటే – ఇంకా కార్యరూపం ధరించని చెడు ఆలోచనలు. వాటిని కూడా ప్రయత్నపూర్వకంగా శాంతింప చేసుకోవాలి. పోగొట్టు కోవాలి.

**ఓం ఇయం యా పరమేష్ఠినీ వాగ్దేవీ బ్రహ్మసంశితా ।**
**య యైవ సస్పృజే ఘోరం తయైవ శాన్తిరస్తు నః ॥ ..... (3)**

<u>వాక్యార్థం</u> :– <u>ఇయం యా పరమేష్ఠినీ వాగ్దేవీ బ్రహ్మసంశితా</u> = ఏ వాణి పరమేష్ఠియైన బ్రహ్మతో (వేదంతో) పదును పెట్టబడుతుందో, ఆ వాణి మమ్ము నీ ఆనంద ధామానికి చేరుస్తుంది.

<u>యయైవ సస్పృజే ఘోరం</u> = ఆ వాణియే దూషితమైతే ఘోరమైన ఫలితాలను కలిగిస్తుంది. అశాంతిని కలిగిస్తుంది.

<u>తయైవ శాన్తిరస్తు నః</u> = కనుక ఓ పరమేశ్వరా ! మా వాణి దూషితం కాకుండా రక్షించి మాకు శాంతిని ప్రసాదించుము.

<u>సరళార్థం</u> :– ఓ పరమేశ్వరా ! నీ విచ్చిన బ్రహ్మజ్ఞానంతో – వేదజ్ఞానంతో పదను పెట్టబడిన మా వాణి మమ్ము నీ ఆనంద ధామానికి చేరుస్తుంది. ఆ వాణియే దూషితమైతే – ఘోరమైనదైతే కష్టాలను, అశాంతిని కలిగిస్తుంది. కనుక ఓ దేవా! మా వాణిని నీ విచ్చిన వేద జ్ఞానంతో పదును పెట్టుకుంటూ శాంతిని పొందుదుము గాక.

May there be peace for us through that speech and knowledge by which the tremendous task can be done and which is that speech and knowledge which occupies its place in Supreme Being is wonderous and revealed by the Supreme Being - GOD.

వైజ్ఞానిక వివరణ : 'బ్రహ్మ' అనే పదమునకు 'పెద్దది, గొప్పది' అని అర్థం. అన్నిటికన్న పెద్ద పరిమాణము, జ్ఞానము, శక్తి గలవాడు కనుక సృష్టికర్తకు 'బ్రహ్మ' అనే పేరు వర్తిస్తుంది. అట్లే జ్ఞానాలలో ఈశ్వరీయమైన వేదమే అన్నిటికన్న గొప్పది. కనుక వేదమును 'బ్రహ్మ' అని పేర్కొనుటం వేదాలలోను, శాస్త్రాలలోను కనబడుతుంది. ఇక మానవ సమాజంలో 4 వేదాలను అధ్యయనం చేసిన వారిని, యజ్ఞయాగాదులు నిర్వహించు పెద్దవారిని కూడా బ్రహ్మ అనటం లోకవాడుక.

'బ్రహ్మసంశితం' అంటే వేదజ్ఞానంతో పరిపక్వమైనది, పరిశుద్ధమైనది అని అర్థం. అట్టివారు పలికే వాణి ఉపద్రవరహితంగా, శాంతి నిచ్చేదిగా ఉంటుంది. రాబోవు 2 మంత్రాలలో బ్రహ్మసంశితములైన బుద్ధి ఇంద్రియాలు మనస్సు ఉన్నతిని శాంతిని కలిగిస్తాయనీ, లేకుంటే విపరీతంగా వర్తించి ఘోరమైన కర్మలు చేయించి అశాంతిని కలిగిస్తాయని చెప్పబడింది.

**ఓం ఇదం యత్ పరమేష్ఠినం మనో వాం బ్రహ్మసంశితమ్ ।**
**యేనైవ ససృజే ఘోరం తేనైవ శాన్తిరస్తు నః ॥ .... (4)**

<u>వాక్యార్థం</u> :- <u>ఇదం యత్ పరమేష్ఠినం మనః వాం బ్రహ్మసంశితమ్</u> = ఏ మనస్సు పరమేశ్వరీయ వేదజ్ఞానంతో పదును పెట్టబడుతుందో ఆ మనస్సు మమ్ము నీ ఆనంద ధామానికి చేరుస్తుంది.

రెండవ వాక్యానికి పూర్వ 3వ మంత్రంలోవలెనే......

(మనస్సును గురించి సంక్షిప్తంగా – మనస్సు మానవులకు పరమేశ్వరుడిచ్చిన గొప్ప ఇంద్రియం. ఇది కన్నులు, చెవులు, కాళ్ళూ చేతులవలె బయటకు కనబడదు. లోపల ఉంటుంది. కనుక దీనిని అంతరింద్రియ మన్నారు. కన్నులు, చెవులు మొదలైన జ్ఞానేంద్రియాలు గ్రహించిన విషయాలను, జ్ఞానాన్ని జీవాత్మలమైన మనకు చేరవేసేది మనస్సే. అది అతివేగంగా తిరుగుతూ అన్ని ఇంద్రియాలతో గ్రహించిన జ్ఞానాన్ని

మనకు అందిస్తుంది, దానికి ప్రతిక్రియగా మన ఆజ్ఞలను కర్మేంద్రియాలకు చేరవేసి వాటితో పనిచేయిస్తుంది. మనస్సును గురించి వివరంగా మరొక పుస్తకంలో తెలుసుకుందాము.)

<u>సరళార్థం</u> : హే అంతర్యామిన్ పరమేశ్వరా ! బ్రహ్మ (వేద) జ్ఞానంతో పుష్టిని పొందిన మా స్త్రీ పురుష లిరువురి మనస్సు మమ్ము నీ తృతీయధామానికి చేర్చుతుంది. ఆ మనస్సే అజ్ఞానంతో కూడి ఘోర పాపాలకు కారణమై నీ నుండి దూరం చేస్తుంది. కావున హే ప్రభో! అట్టి మా మనస్సును జ్ఞానవంతము చేసి మాకు శాంతిని ప్రసాదించుము.

May there even be peace, for us, through that mind of yours, O man and woman, by which the dreadful acts are performed and this is that mind which can be concentrated in God and which has been described by the Veda.

<u>వైజ్ఞానిక వివరణ</u> : ఈ మంత్రంలో 'మనో వాం బ్రహ్మసంశితమ్' అనే ద్వివచన ప్రయోగం ఉంది. మీ యిరువురి మనస్సులు బ్రహ్మసంశితములు కావాలని భావం. కనుక స్త్రీ పురుష లిరువురి మనస్సులు అని అర్థం చేసుకోవాలి. భార్యాభర్తలు అనుకోవచ్చు. దంపతు లిరువురు వేదజ్ఞానం కలిగినవారైతే ఆ యింట చక్కటి శాంతి నెలకొంటుంది. మరెంతో మందికి ఆదర్శవంతంగా శాంతిని యివ్వగలుగుతారు.

**ఓం ఇమాని యాని పఞ్చేన్ద్రియాణి మనః షష్ఠాని**
**మే హృది బ్రహ్మణా సంశితాని ।**
**యైరేవ ససృజే ఘోరం తైరేవ శాన్తిరస్తు నః ॥ ..... (5)**

<u>వాక్యార్థం</u> : <u>ఇమాని యాని పఞ్చేన్ద్రియాణి మనః షష్ఠాని మే హృది బ్రహ్మణా సంశితాని</u> = వేదజ్ఞానంతో బలపడిన పంచ జ్ఞానేంద్రియాలు మరియు మనస్సు ఎవని హృదయంలో నెలకొని ఉంటాయో అతనికి శాంతి కలుగుతుంది.

రెండవ వాక్యానికి 3,4 మంత్రాలలో వలెనే......

<u>సరళార్థం</u> : హే సర్వసాక్షీ! సర్వేశ్వరా ! వేదజ్ఞానంతో సంశితములైన (తేజస్వంతములైన) మా పంచేంద్రియాలు, ఆరవదైన మనస్సు మా హృదయాలలో నెలకొంటే మా కన్నియు శుభములే కలుగుతాయి. అవియే రాగద్వేషాలతో దూషితములైతే

భయంకర పాపాలకు కారణమౌతాయి. హే పరమేశ్వరా ! నీ వేదజ్ఞానంతో మా ఇంద్రియ మనస్సులను శుద్ధ మొనర్చుకొని శాంతిని పొందుదుము గాక !

May there be peace for us even through those five cognitive organs and the mind as sixth, by whom the dangerous task is performed and who are sharpened and placed in my heart.

వైజ్ఞానికి వివరణ : వేదజ్ఞానం కలిగిన వ్యక్తికి ఏ కర్మలు మంచివో- చేయతగినవో, ఏ కర్మలు చెడ్డవో - చేయకూడనివో చక్కగా తెలుస్తుంది. కనుక ఆత్మవంతుడై తన ఇంద్రియాలను, మనస్సును తన వశంలో పెట్టుకొని వాటితో తన ఉన్నతికై యత్నించాలి. లేకుంటే పూర్వ జన్మలలోని సంస్కారాల బలంవల్లనూ, సాంగత్య దోషాల వల్లనూ ఇంద్రియ మనస్సులు ఘోరమైన పాపకర్మలవైపు ప్రవృత్తమౌతాయి. మనచే పాపకర్మలు చేయించి కష్టాలపాలు చేస్తాయి. అశాంతికి గురిచేస్తాయి.

ఈ మంత్రం ద్వారా పరమేశ్వరుడు "ఓ మానవులారా ! తరచుగా వేద స్వాధ్యాయం చేస్తూ ఇంద్రియ మనస్సులను జ్ఞానంతో బలపరచుకోండి. ఇంద్రియ నిగ్రహం కొరకు సదా ప్రయత్నస్తూ నన్ను ఉపాసించండి. ప్రార్థించండి" అని బోధిస్తున్నాడు.

**ఓం శం నో మిత్రః శం వరుణః శం విష్ణుః శం ప్రజాపతిః ।**
**శం న ఇన్ద్రో బృహస్పతిః శం నో భవత్వర్యమా ॥.... (6)**

వాక్యార్థం :- శం నః మిత్రః శం వరుణ ః = మా స్నేహితులు, మా శ్రేష్ఠపురుషులు మమ్ము శాంతి మార్గమున నడుపుదురుగాక

శం విష్ణుః శం ప్రజాపతిః = మా విష్ణువులు, మా ప్రజాపతులు (రాజులు) మాకు శాంతిని కలిగించువారు అగుదురు గాక. (ఇచట విష్ణువులంటే జ్ఞాన విజ్ఞానాలను వ్యాపింప చేసే వారని అర్థం.)

శం నః ఇన్ద్రః బృహస్పతిః = మా దేశ ధనవంతులు, మేధావులు (ఆచార్యులు) మాకు శాంతి నిచ్చువారు అగుదురు గాక.

శం నః భవతు అర్యమా = మా అర్యములు (న్యాయవాదులు, న్యాయమూర్తులు) మాకు శాంతి నిచ్చువారు అగుదురు గాక.

<u>సరళార్థం</u> :- హే సర్వ సంరక్షకా ! మా మిత్రులు, వరుణులు (శ్రేష్ఠ పురుషులు), విష్ణువులు (విద్యావిజ్ఞానాలను వ్యాపింపచేయు విద్వాంసులు), ప్రజాపతులైన రాజులు, ఇంద్రులు (ఐశ్వర్యవంతులు), బృహస్పతులు (ఆచార్యులు), అర్యములు (న్యాయమూర్తులు) వీరంతా మాకు శాంతి నిచ్చువారే అగుదురు గాక !

May God, the friend of all be kind to us, may God, the worshippable by all be gracious to us, may God pervading all be gracious and may the Lord of Creation be kind for us. May He, the master of grand worlds and Almighty be benevolent for us and may He as dispenser of justice be kind upon us.

<u>వైజ్ఞానిక వివరణ</u> :- ధాత్వర్థాలను బట్టి ఈ పదములన్నీ సర్వవ్యాపక సర్వేశ్వరునికిని వర్తిస్తాయి. స్వయంగా వేదం ఏమంటుందంటే -

**ఏకం సద్ విప్రాః బహుధా వదన్తి ।**
**అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ॥**

(ఋగ్వేదం 1-164-46)

**తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదు చంద్రమా ।**
**తదేవ శుక్రం తద్ బ్రహ్మ తా ఆపః స ప్రజాపతిః ॥**

(యజుర్వేదం 32-1)

"ఒకే ఒక సత్ పదార్థం (పరమేశ్వరుడు) అంతటా వ్యాపించి ఉన్నాడు. అతనినే విప్రులు (జ్ఞానులు) బహుధా – అనేక నామములతో పేర్కొంటారు" అంటుంది. కనుక ఆధ్యాత్మికార్థంలో పై మంత్రంలోని పదములన్నీ సృష్టికర్తకును వర్తిస్తాయి. ఇక వ్యావహారికార్థంలో అట్టి గుణములుగల వ్యక్తులకు, పదార్థాలకు వర్తిస్తాయి. ఉదాహరణకు – విష్ణు పదమునకు 'వ్యాపించి ఉండేది' అని ధాత్వర్థం. కనుక శాస్త్రాలలో వ్యాపక గుణముగల యజ్ఞమును, సూర్యుని, వాయువును, విద్యుత్తును, విద్యలను, విద్వాంసులను, రాజును విష్ణు పదముతో పేర్కొనటం కనబడుతుంది. సూర్యుడు, రాజు, విద్వాంసులు ఏక దేశీయులే అయినా వారి ప్రకాశము, శాసనము, విద్యలు వ్యాపిస్తూ ఉంటాయి.

దేవుడు సదా శాంతి స్వరూపుడు, శాంతిదాత కనుక పై అథర్వవేద శాంతి మంత్రానికి వ్యవహారపరంగా తెలుగులో అర్థం వ్రాయటం జరిగింది.

ఓం శం నో మిత్రః శం వరుణః శం వివస్వాఞ్ఛ మన్తకః ।
ఉత్పాతాః పార్థివాన్తరిక్షాః శం నో దివిచరా గ్రహాః ॥ ....... (7)

వాక్యార్థం : శం నః మిత్రః శం వరుణః = మిత్రా వరుణులు (ప్రాణ అపానములు) మాకు శాంతి నిచ్చును గాక !

శం వివస్వాన్ + శమ్ + అన్తక ః = వివిధ ప్రకారాల ప్రకాశించే సూర్యుడు మరియు జీవితాన్ని ముగింపు చేసే మృత్యువు కూడా మాకు శాంతి నిచ్చునవియే అగును గాక !

ఉత్పాతాః పార్థివా + అన్తరిక్షాః = భూమిపైన, అంతరిక్షంలోను కలుగు ఉపద్రవములన్నియు ఉపశమించి-ఎక్కువగా నష్టమును కలిగించకుందును గాక !

శం నో దివిచరాః గ్రహాః = ఆకాశంలో చరించు మంగళ, బుధ, గురు, శుక్ర, శని మొ॥ గ్రహ గోళాలు మాకు శాంతిదాయకము లగును గాక !

సరళార్థం : ఓ పరమేశ్వరా ! నీ కృపవలన ప్రాణ అపానాది వాయువులు వివిధ కిరణములు గల సూర్యుడు, మృత్యువు శాంతిదాయకము లగును గాక ! భూ అంతరిక్షాలలో అప్పుడప్పుడు కలుగు ఉపద్రవాలు మాకు పెద్ద నష్టము కలిగించక ఉపశమించును గాక ! అంతరిక్ష ద్యులోకాలలో వాటి వాటి కక్షలలో చరించు వివిధ గ్రహ ఉపగ్రహాదులు మాకు శాంతి నిచ్చును గాక!

May the air be peaceful for us, may the water be peaceful, may the sun and may the time ending all be peaceful for us. May the disturbances having their origin on the earth and atmosphere be peaceful for us and be free from agitation for us and all the planets in the sky.

వైజ్ఞానిక వివరణ :- మిత్ర వరుణ పదములు వేదాలలో పెక్కుచోట్ల కనబడతాయి. విడివిడిగాను, జంటగాను కూడా కనబడతాయి. ఆ యా ప్రకరణాలను బట్టి భాష్యకారులు ఆ పదములకు వేరు వేరు అర్థాలు వ్రాశారు. 6వ మంత్రంలో ఈ పదములకు వ్యక్తుల పరంగా మిత్రులు, శ్రేష్ఠులు అని అర్థాలు వ్రాయటం జరిగింది. ఈ మంత్రంలో ప్రకరణాన్ని బట్టి ప్రాకృతిక దేవతల పరంగా చెప్పబడింది. కొందరు భాష్యకారులు ప్రాణ ఉదాన వాయువులనీ, సూర్య వాయువులనీ, ద్యావా పృథివీ లోకాలనీ అర్థాలు వ్రాశారు. వేదాలలోని వర్షేష్టి ప్రకరణంలో

**మిత్రావరుణౌ వృష్ట్యాధిపతీ తౌ మావతామ్...**

– అథర్వవేదం (5-24-5)

అనే మంత్రంలో ప్రాణవాయువు భూమినుండి జలాన్ని పైకి తీసుకుపోతుందనీ, అపానవాయువు మేఘాలను వర్షింపచేసి జలాన్ని మరల భూమిపైకి తీసుకు వస్తుందనీ, మిత్రావరుణులకు ప్రాణ అపాన వాయువులుగా అర్థం చెప్పబడింది. ఏమైనను 'ఓ పరమేశ్వరా ! నీ శాసనంతో ఈ ప్రాకృతిక దేవతలన్నీ ఉపద్రవ రహితములై మాకు సుఖశాంతులను ప్రసాదించాలనే ప్రార్థన ఈ మంత్రంలోనూ, రాబోవు మంత్రాలలోను ఇమిడి ఉంది.

సూర్యునిలో వెయ్యిరకాల కిరణాలున్నాయని ప్రాచీన శాస్త్రాలు చెబుతాయి. వాటిలో వృష్టి సర్జన కిరణాలు, హిమ సర్జన కిరణాలు, ఘర్మ (వేడి) సర్జనాలు ముఖ్యంగా ఉంటాయట. వీటికి వేరు వేరు పేర్లు కనబడతాయి. 7 రంగుల కాంతి కిరణాలకును సుషమ్నః, హరికేశః మొదలైన వేరు వేరు పేర్లు కనబడతాయి. కనుకనే వేదాలలో సూర్యుని వివస్వాన్ - వివిధ రకాలుగా ప్రకాశించేవాడని పేర్కొనటం జరిగింది. ఇక ప్రాణులకు మృత్యువుకూడా అవసరమే. మృత్యువు, జీర్ణశీర్ణమై పోయిన శరీరం నుండి విముక్తిని కలిగించి క్రొత్త శరీరాన్ని ఇస్తుంది కదా! అయితే అది బాధాకరంగా కాక శాంతిదాయకంగా ఉండాలని ఈ మంత్రం చెబుతున్నది.

**ఓం శం నో భూమిర్వేప్యమానా శముల్కా నిర్హతం చ యత్ ।**
**శం గావో లోహిత క్షీరాః శం భూమిరవ తీర్యతీః ॥ .... (8)**

<u>వాక్యార్థం</u> :- <u>శం నో భూమిః + వేప్యమానా</u> = సృష్టి గమనంలో అప్పుడప్పుడు జరుగు భూకంపాలు మాకు ఎక్కువ కష్టనష్టాలను కలిగించకుందును గాక !
<u>శమ్ ఉల్కా నిర్హతం చ యత్</u> = అరుదుగా జరుగు ఉల్కా పాతములు ఈ భూమికి పెద్ద నష్టము కలిగించకుండునుగాక !
<u>శం గావో లోహిత క్షీరాః</u> = కొన్ని వ్యాధులతో గోవులు రక్తపురంగుతో పాల నిచ్చుచుండును. అవియును మాకు ఎక్కువ అపకారము చేయకుండును గాక.
<u>శం భూమిః + అవతీర్యతీః</u> = చాల అరుదుగా జరుగు భూమి కృంగుదలలు (పెద్ద పెద్ద బీటలు) ను ఎక్కువ నష్టమును కలిగించకుందును గాక !

సరళార్థం :- హే సంరక్షకా ! నీ కృపవల్ల సృష్టిగమనంలో అప్పుడప్పుడు కలిగే భూకంపాలు, ఉల్కాపాతాలు, దోషయుక్తమైన గోక్షీరాదులు, భూమి కృంగుదలలు (బీటలు) మొదలగు వాటివల్ల మాకు పెద్ద నష్టము కలుగకుండును గాక ! నీవు మాకు అట్టి ఉపద్రవములనుండి రక్షించుకొనగల జ్ఞానమును ప్రసాదించుము. ముందుగానే మమ్ము జాగరూకులను చేసి శాంతిని ప్రసాదించుము.

May this trembling earth be source of peace for us and may be free from disturbance whatever is called the stroke of flaming meteor, the atmospheric phenomenon. May the twelve Adityas, the months of a year (Gavah) which are the source of causing red water, the blood in the bodies be free from troubles for us and may the earth sliding and sinking be source of peace for us.

వైజ్ఞానిక వివరణ :- మనం నివసించే ఈ భూమి ఒక అద్భుతమైన గ్రహం. దీనిపై వాతావరణం ఉండటంవల్లా, భూమి పైభాగంలో (crust పై) ఎన్నెన్నో ఖనిజ సంపద లుండుటం వల్ల ఇది వసుధ - ఐశ్వర్యాల నిధి. $23\frac{1}{2}$ డిగ్రీలు ఏటవాలుగా ఉంటూ సూర్యుని చుట్టూ దీర్ఘవృత్తాకారంలో తిరుగుతూ ఉండటంవల్ల ఋతువు లేర్పడుతున్నాయి. ప్రాణులన్నీ సుఖంగా జీవించ గలుగుచున్నాయి.

అయితే అప్పుడప్పుడు కొన్ని ప్రాకృతిక ఉపద్రవాలు కలుగుతూ ఉంటాయి. సృష్టిగమనంలో అవి తప్పవు. కొన్ని మానవ తప్పిదాలు కూడా ఉంటాయంటున్నారు వైజ్ఞానికులు. విచక్షణారహితంగా గనులనుండి బొగ్గు, ఖనిజాలు, తైలాలు స్వీకరించి వాటిని సరిగా నింపకపోవటంవల్ల కొన్ని భూకంపాలు వస్తున్నాయట. కొన్ని నెలల క్రితం కేదార్‌నాథ్‌లో ఏర్పడిన వరదలకు ఆ పర్వతాలలో నిర్మించిన సొరంగమార్గాలు కారణమంటున్నారు.

విచిత్రంగా కొన్ని జంతువులు రాబోవు ఉపద్రవాలను ముందుగానే గుర్తించి దూరంగా పారిపోతున్నాయట. పరిశోధనలు చేస్తే అటువంటి జ్ఞానాన్ని మనంకూడా పెంచుకోవచ్చు. వేదాలలో ప్రాకృతిక జ్ఞానం బీజరూపంలో ఉంది. దానిని అధ్యయనం చేసి మనన చింతన పరిశోధనలు చేస్తే మరెన్నో విషయాలు తెలుస్తాయి. అవి సృష్టికర్త యిచ్చిన జ్ఞాననిధులు కదా !

ఓం నక్షత్ర ముల్కాభిహతం శమస్తు నః, శం నోఽభిచారాః
శము సన్తు కృత్యాః ।
శం నో నిఖాతా వల్గాః శముల్కా దేశోపసర్గాః
శము నో భవంతు ॥ ..... (9)

వాక్యార్థం :- నక్షత్రమ్ + ఉల్కాభిహతం శమ్ + అస్తు నః = ఉల్కలుగా నష్టమగుచున్న నక్షత్రాలు శాంతించును గాక !
శం నః అభిచారాః = శత్రువులు మాపై చేయు దాడులు శాంతించును గాక.
శము సన్తు కృత్యాః = వారు చేయు హత్యాప్రయత్నాలును శాంతించును గాక !
శం నః నిఖాతాః వల్గాః = వారు పెట్టు మందుపాతరలు, బాంబు దాడులు శాంతించును గాక.
శమ్ + ఉల్కాః దేశోప సర్గాః శమ్ నః భవన్తు = ఉల్కాపాతాలు, దేశంలోపల ఏర్పడే కరువుకాటకాలు, వ్యాధులు అన్నియు శాంతించును గాక.
సరళార్థం :- ఓ దయాసాగరా ! నీ కృపవలన ఉల్కలుగా నష్టమగుచున్న నక్షత్రాలు, శత్రువుల మోసాలు, హింసా ప్రవృత్తులు, హత్యాప్రయత్నాలు శాంతించును గాక ! వారు పెట్టు మందు పాతరులు, బాంబులు, సొరంగాలు విఫలములగును గాక. ఉల్కాపాతాలు, దేశంలో ఏర్పడే కరువుకాటకాలు, వ్యాధులు అన్నియు శాంతించును గాక.

May be free from agitations for us the constellation striken by meteor, may the strategies and designs made ( by others) to trouble us be free from inflictions, may the artificial devices used upon us be free from causing troubles. May the mines arranged and buried (to inflict us) be in vain, may the shooting star be free from disturbance for us and may not the calamities falling on the country trouble us.

వైజ్ఞానిక వివరణ :- విశ్వంలో అక్కడక్కడ కొన్ని నక్షత్రాలు (సూర్య కుటుంబాలు) విచ్ఛిన్నమై ధూళిగా రాలిపోతుంటాయి. దానిని 'కాస్మిక డస్ట్' (Cosmic Dust) అంటారు. అది మన భూమిమీద కూడా పడుతూ భూమియొక్క బరువు పెంచుతున్నదట. కుజగ్రహానికి గురుగ్రహానికి మధ్యన గ్రహశకలాలతో కూడిన ఒక

వలయం సూర్యునిచుట్టూ తిరుగుతున్నదట. అక్కడ ఒక గ్రహం ఉండేదనీ ఏ కారణం చేతనో అది ముక్కలైపోయి ఆ ముక్కలు వలయంగా తిరుగుతున్నాయని వైజ్ఞానికు లంటున్నారు. ఆ ముక్కలు ఒక్కొక్కసారి మన భూమికి దగ్గరగా రావటం భూమిచే ఆకర్షింపబడటం జరుగుతుంది. వాటినే ఉల్కాపాతము లంటారు. అయితే ఆ ముక్కలు వేగంగా పడిపోతూ ఒత్తిడికి మండిపోయి బూడిదగామారి రాలిపోతూ ఉంటాయి. చాలా అరుదుగా పెద్దముక్కలు కొంత భస్మమై మిగిలినది భూమిపై పడే అవకాశముంది. ముక్క పడిన ప్రదేశాన్ని బట్టి ప్రాణనష్టం జరుగుతుంది. పూర్వం ఎప్పుడో ఒక ఉల్క ఆస్ట్రేలియా ఖండంలో పడినచోట ఒక సరస్సు ఏర్పడిందని కొందరు వైజ్ఞానికులంటున్నారు.

ఇటువంటి ప్రాకృతిక ప్రమాదాలేకాక సామాజిక జీవనంలో మన విరోధులనుండియు కొన్ని ప్రమాదాలు వచ్చే అవకాశం ఉంది. కనుక అట్టివన్నీ శాంతించాలనీ, వాటినుండి మమ్ము రక్షించమనీ ఈ మంత్రంలో ప్రార్థన ఉంది. అంటే శత్రువుల కుతంత్రాలను, కదలికలను వేగులద్వారా (గూఢచారుల ద్వారా) ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ అందుకు తగిన రక్షణ ఏర్పాట్లు చేసుకోవాలని భావం.

**ఓం శం నో గ్రహాశ్చాన్ద్రమసాః శమాదిత్యశ్చ రాహుణా ।**
**శం నో మృత్యు ర్ధూమకేతుః శం రుద్రాస్తిగ్మ తేజసః ॥ ... (10)**

వాక్యార్థం :- శం నః + గ్రహాః + చాన్ద్రమసాః = చంద్రులతో (ఉపగ్రహాలతో) కూడి ఉండే గ్రహాలు మాకు శాంతి దాయకము లగును గాక !

శమ్ + ఆదిత్యః + చ + రాహుణా = ఆదిత్యుడు (సూర్యుడు) మరియు రాహువులు మాకు శాంతి నిచ్చును గాక.

శం నః + మృత్యుః + ధూమకేతుః = మృత్యువు వంటి ధూమకేతువు (తోక చుక్క) మాకు శాంతి నిచ్చును గాక.

శం రుద్రాః + తిగ్మతేజసః = తీక్షణ ప్రకాశంతో రౌద్రంగా ఉండే గ్రహగోళాలు కూడా శాంతించును గాక.

సరళార్థం :- ఓ సర్వసంరక్షకా ! నీ శాసనంతో నడిచే ఈ విశ్వంలో చంద్రులతో కూడి ఉండే ఉపగ్రహాలు మాకు శాంతి దాయకములగును గాక. సూర్యుడు మరియు

రాహువులు (నీడలు) మాకు శాంతి నిచ్చును గాక. తీక్షణ ప్రకాశంతో రౌద్రంగా ఉండే గ్రహగోళాలును మాకు శాంతి నిచ్చునవియే అగును గాక.

May the planets concerned with the moon and the sun with Rahu, the shadow of moon between sun and earth be free from agitation for us. May the death and meteor be free from disturbances for us and may Rudras, the fires having piercing powers be peaceful for us.

<u>వైజ్ఞానిక వివరణ</u> :- అనంతంగా భాసించే ఈ విశాల విశ్వంలో స్వయంగా ప్రకాశించే గోళాలను సూర్యులనీ - నక్షత్రాలనీ అంటారు. అట్టి సూర్యులచుట్టూ తిరుగుతూ ఉండే గోళాలను ఉపగ్రహాలంటారు. ఉపగ్రహాలనే 'చంద్రులు' అనియు అంటారు. 'చది - ఆహ్లాదే' అనే సంస్కృత మూల పదంతో 'చంద్ర' పదము తయారయ్యింది. సూర్యప్రకాశం వాటిపై పడి అది పరావర్తనం చెంది మనకు ఆహ్లా దాన్ని కలిగించే వెన్నెలగా భాసిస్తుంది. అందుచే వాటిని చంద్రులు - ఆహ్లాదాన్నిచ్చేవి అంటుంది వేదం. గ్రహాలపై ఉండే జీవరాశికి ఆహ్లాదాన్ని కలిగించే చంద్రుని ప్రకాశం - వెన్నెల కూడా అవసరమే. ధాన్యాలు కాయ తయారయ్యే సమయంలో మబ్బులు లేకుండా ప్రకాశవంతమైన వెన్నెల వాటిపై పడితే పంటదిగుబడి ఎక్కువగా ఉంటుందంటారు రైతులు.

"పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః - రస స్వరూపుడైన చంద్రుడు ఓషధులకు (కాయ పప్పు ధాన్యాలకు) పుష్టిని కలిగించుచున్నా" డంటుంది భగవద్గీత (15-13).

అట్టి రసాత్మకుడైన చంద్రునకు అప్పుడప్పుడు గ్రహణం పడుతుంది. చంద్రునిపై కొంతభాగం సూర్యప్రకాశం పడకుండా భూమి అడ్డువస్తుంది. అది మనకు చంద్రగ్రహణంగా కనబడుతుంది. ఆ నీడను కేతువు అంటుంది భారతీయ జ్యోతిషం. ఆ గ్రహణ సమయంలో సున్నితతత్త్వంగల ప్రాణులకు స్వల్పంగా అనారోగ్యం కలుగవచ్చు. అట్టిదికూడా పెద్ద యిబ్బంది పెట్టకుండా శాంతిదాయకం కావాలనే ప్రార్థన ఈ మంత్రంలో ఉంది. ఈ విధంగానే అప్పుడప్పుడు చంద్రుడు అడ్డురావటంవల్ల సూర్యగ్రహణం ఏర్పడుతుంది. దానిని సూర్యుడు రాహు గ్రస్త మయ్యా డంటుంది జ్యోతిషం. అప్పుడు కూడా సున్నితతత్త్వం గల ప్రాణులకు స్వల్పమైన అనారోగ్యం

కలుగవచ్చు. అట్టిదియు శాంతిదాయకం కావాలని ప్రార్థన.

సామాన్యంగా గ్రహణ సమయాలలో మనకు పెద్ద అనారోగ్యం కనబడదు. అంతమాత్రంచేత ఆ సమయంలో అన్నీ తినవచ్చు, అన్ని పనులు చేసుకోవచ్చు అని ఆధునిక హేతువాదులు ప్రచారం చేస్తూ ఉంటారు. అది మంచిదికాదు. కొందరి శరీర తత్త్వాలు చాలా సున్నితంగానూ సునిశితంగానూ ఉంటాయి. అట్టివారిలో ముఖ్యంగా శ్లేష్మతత్త్వం గలవారి శరీరంలో వివిధ అగ్నులు మరింత తగ్గిపోతాయి.

## 33 దేవతలు - గ్రహణాలు

అనంతజ్ఞానంగల పరమేశ్వరుని సృష్టిలో అన్నిదేవతలూ అవసరమే. ఇక్కడ దేవతలు అంటే ప్రాకృతిక దేవతలు. అవి చాలానే ఉంటాయి. కాని, వాటిలో ముఖ్యమైనవి 33 అంటుంది వేదం. అవి - అష్ట వసువులు (8), ఏకాదశ రుద్రులు (11), ద్వాదశాదిత్యులు (12), ఇంద్ర ప్రజాపతులు (2).

అష్టవసువులు - పంచభూతాలు + సూర్య చంద్ర నక్షత్రాలు = 8, ఏకాదశ రుద్రులు - శరీరస్థ దశ ప్రాణాలు + జీవాత్మ = 11, ద్వాదశాదిత్యులు -12 ఆదిత్యులు (సూర్యుడు ఒక్కడే అయినా నెలకొక రకమైన కిరణాలను ప్రసరింప చేస్తాడు. ఉదా : మేషరాశిలో ఉన్నప్పుడు ఒక రకంగా , మకరరాశిలో ఉన్నప్పుడు ఒకరంగా స్వల్పభేదంతో సూర్యకిరణాలుంటాయి.) ఇంద్రుడంటే ఇక్కడ మేఘాలలోని మెరుపులుగా గ్రహించాలి. ప్రజాపతి అంటే ప్రజలను - ప్రాణులను పాలించే అగ్నిహోత్ర మని గ్రహించాలి. వీటిలో ముఖ్యంగా పగలు సూర్యుడు, రాత్రి చంద్ర నక్షత్రాగ్నులు మనను కాపాడుతుంటాయి. కనుక దైనిక అగ్నిహోత్రంలో ఉదయం సూర్యదేవతకు, సాయంత్రం అగ్నిదేవతకు ఆహుతులివ్వాలంటాయి మన వేదశాస్త్రాలు. తద్వారా ఆ ఆహుతులు మిగిలిన అన్ని దేవతలకు అందుతాయి. గ్రహణ సమయాలలో ఈ సమన్వయంలో స్వల్పవ్యత్యాసాలు ఏర్పడతాయి. అప్పుడు సున్నిత సునిశిత శరీరతత్త్వాలు గలవారికి కొన్ని యిబ్బందులు ఏర్పడవచ్చు. అందరికీ కాదు. గర్భిణులలోను, వారి లోపల పెరిగే పిండాలలోను (చాలా కొద్ది మందిలో) అగ్నితత్త్వం కొద్దిగా తగ్గవచ్చు. అట్టివి కూడా శాంతించాలని ఈ మంత్రం ప్రార్థించమంటుంది.

పాశ్చాత్యనాగరికతా ప్రభావంతో ఇప్పుడు వారానికి ఒక రోజు, $1\frac{1}{2}$, 2 రోజులు కూడా సెలవులు వచ్చాయి. కాని, పూర్వం అమావాస్య, పౌర్ణమి దినాలు మాత్రమే సెలవులుగా ఉండేవి. ఆ దినములలో ఆర్యులు విశేష హోమాలు చేసి పరమేశ్వరుని అద్భుతాద్భుత సృష్టిలోని విభూతులను (మహిమలను) అర్థం చేసుకుంటూ భక్తిపరవశు లయ్యేవారు. ఆ రోజులలోనే – అమవాస్యకు సూర్యగ్రహణం, పౌర్ణమికి చంద్రగ్రహణం వస్తాయి కదా! అనంత నామాలుగల దేవునకు పౌర్ణమాసీ, అమావాస్యా అనే పేర్లూ, రాహువు, కేతువు అనే పేర్లు కూడా వేదాలలో కనబడతాయి. ఆయన పేర్లన్నీ గుణవాచకాలేకాని, వివిధ రూపాలు కాదు. సృష్టిలో అంతటా పూర్ణంగా వ్యాపించి ఉంటాడు కనుక (పూర్ణమ్ + ఆసీత్ ) = పూర్ణమాసీ అని పేరు. 'అమా' అంటే 'తోడు'గా అని అర్థం. అమావాస్యుడు అంటే ఏల్లప్పుడూ సర్వకాల సర్వావస్థలయందు మనకు తోడుగా ఉంటాడు, అని అర్థం. 'రాహువు' (రహ– త్యాగే) దుష్టులను, దుర్మార్గులను త్యజించువాడు కనుక దేవునికి 'రాహువు' అని పేరు. సమస్త క్లేశాలనుండి విడిపించువాడు కనుక దేవునకు 'కేతువ' ని పేరు.

గ్రహణ సమయాలలో ఈ విధంగా పరమేశ్వరుని విభూతులను (గుణగణాలను, మహిమలను) మననం చేస్తూ ఉపాసనామగ్నులం కావటం ఉత్తమం. ఇట్టి ఉపాసనను 'విభూతి యోగం' అని కూడా అంటారు. వివరంగా తెలిసికొనగోరువారు మహర్షి దయానందుల వారి 'సత్యార్థప్రకాశం' చదువగోరుచున్నాము.

## ధూమకేతువులు (Comets)

ధూమకేతువు లంటే తోకచుక్కలు (Comets). ఇవి కూడా సూర్య కుటుంబంలోనివే. గ్రహాల మాదిరిగా తోకచుక్కలు సూర్యుని చుట్టూ వాటి పరిధిలో తిరుగుతూ ఉంటాయి. ఆ పరిధి ప్లూటో గ్రహం కన్ననూ చాలా దూరంలో ఉందట. అందుచే సామాన్యకంటికి అవి కనబడవు. అందులో ఏదైనా ఒకటి భూమికి సమీపంగా వచ్చినపుడు మాత్రమే మనం చూడగలుగుతాం. 76 సంవత్సరాల కొకసారి అలా ఒక తోకచుక్క మనకు కనపడుతుందట. తోకచుక్కలను గురించిన కథలన్నీ ఏవేవో అరిష్టాలను సూచిస్తూ ఉంటాయి. కాని, ఆధునిక వైజ్ఞానికులు అవి

ఏమీ హానిచేయవని అంటున్నారు. వీటిని మన వేదశాస్త్రాలు ధూమకేతువు లన్నాయి. ఆధునిక విజ్ఞానం కూడా వాటి తోకలలో మేథేన్, అమ్మోనియా వంటి వాయువులు ఉంటాయంటుంది. అవి ఏ నియమానికి కట్టుబడి సూర్యుని సమీపానికి వస్తున్నాయో, తిరిగి వెడుతున్నాయో తెలియటం లేదట. అవి భూమికి సమీపంగా వచ్చినపుడు వాటి తోకలోని మిథేన్, అమ్మోనియా వాయువులవల్ల సున్నితతత్త్వంగల ప్రాణులకు ఏదైనా కీడు జరుగుతుందేమో తెలియదు. వేదం మాత్రం **"శం నో మృత్యుః ధూమకేతుః"** అంటున్నది. అంటే కష్టాన్ని కలిగించే ధూమకేతువులు కూడా మాకు శాంతిదాయకములు కావాలని ప్రార్థించమంటున్నది.

**ఓం శం రుద్రాః శం వసవః శమాదిత్యాః శమగ్నయః ।**
**శం నో మహర్షయో దేవాః శం దేవాః శం బృహస్పతిః ॥ ... (11)**

వాక్యార్థం :- శం రుద్రాః శం వసవః = రుద్రబ్రహ్మచారులు, వసుబ్రహ్మచారులు మాకు శాంతిని కలిగింతురు గాక.
శమ్ + ఆదిత్యాః శమ్ + అగ్నయః = ఆదిత్యబ్రహ్మచారులు, అగ్నులు - మార్గదర్శకులైన మహాపురుషులు మాకు శాంతిని కలిగింతురు గాక !
శం నః మహర్షయః + దేవాః = వేదమంత్రార్థ ద్రష్టలైన మహర్షులు, దేవతలు - దివ్యగుణసంపన్నులు మాకు శాంతి మార్గములను బోధింతురు గాక !
శం దేవాః శం బృహస్పతిః = విద్యాసంపన్నులైన దేవతలు మరియు బృహస్పతులైన ఆచార్యులు మాకు శాంతి విద్యలను బోధింతురు గాక !

సరళార్థం : ఓ వేద విద్యాదాతా ! పరమేశ్వరా ! నీ కృపవలన వసు, రుద్ర, ఆదిత్య బ్రహ్మచారులు, మార్గదర్శకులైన నాయకులు మాకు శాంతిని చేకూర్చువారు అగుదురు గాక ! మహర్షులు, విద్వాంసులు, విజ్ఞానవేత్తలు, మేధావులు, ఆచార్యులు అందరూ మాకు శాంతి నిచ్చువారే అగుదురు గాక !

May be favourable for us Rudras, the persons observing the discipline of continence for 44 years, may be favourable for us Vasus the persons observing the discipline of continence for 24 years, may be favourable for us Adityas the persons observing discipline of continence for 48 years, may be favourable for us all the fires of Yajna (Ahavaneya.

Garhapatya and Prajapatya), may be favourable for us the great seers of wonderful wisdom and men of enlightenment and may be gracious for us the men having masterly control over Vedic speech and knowledge.

వైజ్ఞానిక వివరణ :- ఒక వేదం చదువుకున్న బ్రహ్మచారులను (విద్యార్థులను) వసు బ్రహ్మచారు లంటారు. 2 వేదాలు చదువుకున్నవారిని రుద్రబ్రహ్మచారులు లేదా రుద్రులు అంటారు. నాలుగు వేదాలు అధ్యయనం చేసిన వారిని ఆదిత్యబ్రహ్మచారులు లేదా ఆదిత్యులు అని అంటారు. ఇట్టి వారంతా శాంతిదాయకులు కావాలంటుంది వేదం. వేదాలలోని అగ్ని పదం విశాలంగా చాలా అర్థాలను కలిగి ఉంటుంది. 'అఞ్చు - గతి పూజనయోః అనే సంస్కృత ధాతువుతో అగ్ని పదం తయారౌతుంది. కనుక గతి కలిగినది, పూజింప తగినది అగ్ని అవుతుంది. గతి అంటే కేవలం గమనము, కదలిక అనే అర్థాలేగాకుండా (గతిస్త్రయోఽర్థ:- జ్ఞానం, గమనం ప్రాప్తిశ్చేతి)' జ్ఞానం కలది, ప్రాప్తించ తగినది అని కూడా అర్థం. అందుచే ఈ పదం ఆధ్యాత్మికార్థంలో పరమేశ్వరునికి వర్తిస్తుంది. అనంతమైన జ్ఞానం, అనంతమైన గతి శక్తి సామర్థ్యాలు అతనిలో ఉన్నాయి. ఇంతేకాక, జీవులందరి చేత అతడు ప్రాప్తింప తగిన ఆనందస్వరూపుడు మరియు పూజింప తగినవాడు. ఈ అగ్ని పదంతోనే ఋగ్వేదం ప్రారంభమౌతుంది. పరమేశ్వరుని అగ్ని పదంతో సంభోదించే మంత్రాలు నాలుగు వేదాలలోనూ వందల కొలది ఉన్నాయి.

అగ్ని పదం ఆధిభౌతిక అంటే ప్రాణుల పరమైన అర్థంలో జ్ఞానులకు, మార్గదర్శకులైన నాయకులకు, రాజులకు, సైన్యాధ్యక్షులకు వర్తిస్తుంది. ఆధి దైవికార్థంలో సామాన్య అగ్నికి, సూర్యునికి, అగ్ని హోత్రానికి వర్తిస్తుంది. అగ్ని - భూర్ భువ స్వర్లోకాలు మూడింటిలోను ఉంటుందంటుంది వేదం. భూలోకంలో సామాన్య అగ్నిగాను, భువర్లోకంలో జాతవేదాగ్నిగాను, స్వర్లోకంలో అంగిరాగ్ని గాను ఉంటుందంటుంది యజుర్వేదం (3-1,2,3 మంత్రాలలో).

ఈ శాంతిమంత్రంలో ప్రకరణాన్ని అనుసరించి (Context ను బట్టి) ఆధి భౌతిక పరంగా మార్గదర్శకులైన నాయకులుగా అర్థం చెప్పబడింది. (అగ్నిః అగ్రణీర్ భవతి) మంత్రార్థ ద్రష్టలైన యోగులను ఋషులనీ, మహర్షులనీ అంటారు. 'దేవ' పదంలో కూడా చాలా విశాలమైన అర్థాలుంటాయి. ఆధి భౌతికార్థంలో దివ్యగుణాలు

కలిగిన మహాత్ములనీ, విద్వాంసులనీ, విజ్ఞానవేత్తలనీ అర్థం. బృహస్పతి పదం విద్యలో మిగిలిన వారికన్న పెద్ద విద్వాంసునికి వర్తిస్తుంది. ఇట్టివారిని ఆచార్యులంటారు.

ఓం బ్రహ్మ ప్రజాపతిర్ధాతా లోకా వేదాః
సప్త ఋషయోஉగ్నయః ।
తైర్మే కృతం స్వస్త్యయనమిన్ద్రో మే శర్మ యచ్ఛతు
బ్రహ్మ మే శర్మ యచ్ఛతు ।
విశ్వే మే దేవాః శర్మ యచ్ఛన్తు, సర్వే మే దేవాః శర్మ యచ్ఛన్తు ॥ ...... (12)

వాక్యార్థం :- బ్రహ్మ ప్రజాపతిః + ధాతా లోకా వేదాః = మా దేశంలోని పూర్ణ విద్వాంసులైన బ్రహ్మలు, ప్రజాపాలకులు, న్యాయమూర్తులు, సమస్త రాష్ట్రాలు, నాలుగువేదాలు.

సప్త ఋషయః + అగ్నయః = సప్త ఋషులు (పంచ జ్ఞానేంద్రియాలు, మనో బుద్ధులు), అగ్నులు (మార్గదర్శకులు).

తైః + మే కృతం స్వస్త్యయనమ్ = వీరందరు నాకు శుభములను, సుఖ శాంతులను ఇచ్చువారు అగుదురు గాక !

ఇన్ద్రః + మే శర్మ యచ్ఛతు = రాజు నాకు మేలు చేయును గాక !

బ్రహ్మ మే శర్మ యచ్ఛతు = బ్రహ్మాండనాయకుడైన పరమేశ్వరుడు నాకు శుభమును కలిగించును గాక !

విశ్వే మే దేవాః శర్మ యచ్ఛన్తు = సమస్త విద్వాంసులు, విజ్ఞానవేత్తలు, మహాత్ములు అందరూ నాకు మేలుచేయువారే అగుదురు గాక !

సర్వే మే దేవాః శర్మ యచ్ఛన్తు = సర్వ ప్రాకృతిక దేవతలు, దివ్యగుణయుక్త పదార్థాలు నాకు శాంతి నిచ్చునవియే అగును గాక !

సరళార్థం :- మా దేశంలోని పూర్ణవిద్వాంసులైన బ్రహ్మలు, ప్రజాపాలకులు, న్యాయమూర్తులు, సమస్తరాష్ట్రాలు, నాలుగు వేదాలు, సప్త ఋషులు (పంచజ్ఞానేంద్రియాలు, మనోబుద్ధులు) మారదర్శకులైన నాయకులు, వీరంతా నాకు శుభములను, సుఖశాంతులను ఇచ్చెదరు గాక ! రాజు నాకు మేలు చేయును గాక. బ్రహ్మాండ నాయకుడైన పరమేశ్వరుడు నాపై శుభములను కురిపించును గాక.

సమస్త విద్వాంసులు విజ్ఞానవేత్తలు, మహాత్ములు నాకు శాంతినిచ్చువారు అగుదురు గాక. సమస్త ప్రాకృతిక దేవతలు ఉపద్రవ రహితములై నాకు శాంతినిచ్చును గాక.

May the path of mine be made peaceful by Supreme Being, the ruler of the subject, the air, the people, Vedas, the seven seers - the seven cognitive powers and the fires the substance, electricity, sun, heat of digestion and Brahma, the pervading cosmic heat. May mighty electricity or mighty spirit give me happiness, may Brahma, the master of four Vedas give me happiness, may Vishvedevah, the natural forces give me pleasure and may all the wonderous and learned men give me happiness.

వైజ్ఞానిక వివరణ :- మానవుడు సామాజిక ప్రాణి. ఒంటరిగా జీవించలేదు. తాను ఎంత విద్వాంసుడైనా సమర్థవంతుడైనా మరికొందరి సాయం లేకుండా జీవనయాత్ర జరగదు. తోటివారివల్లనూ దేశవాసులవల్లనూ కూడా కొన్ని అశాంతు లేర్పడవచ్చును. కనుక పై వేదమంత్రం మీ దేశ విద్వాంసులు నాయకులు, న్యాయమూర్తులు అందరూ మీకు శాంతిని చేకూర్చు వారయినపుడే జీవితం ఒడిదొడుకులు లేకుండా సాఫీగా, శాంతిగా జరుగుతుందని చెబుతున్నది.

ఓం యాని కాని చిచ్ఛాన్తాని లోకే సప్తఋషయో విదుః ।
సర్వాణి శం భవన్తు మే శం మే అస్త్వభయం మే అస్తు ॥ .... (13)

వాక్యార్థం :- యాని కాని చిత్ + శాన్తాని లోకే సప్తఋషయః + విదుః = సప్త ఋషులుగా వర్ణింపబడే పంచ జ్ఞానేంద్రియాలు, మనోబుద్ధులు ఏ ఏ పదార్థాలను, కర్మలను తెలుసు కొనుచున్నవో అవన్నీ మాకు శాంతి నిచ్చునవియే అగును గాక !
సర్వాణి శం భవన్తు మే = సర్వము నాకు శాంతి నిచ్చును గాక !
శం మే అస్తు + అభయం మే అస్తు = అవన్నీ నాకు శుభములను, నిర్భయమును కలిగించును గాక !

సరళార్థం : ఓ అభయదాత పరమేశ్వరా ! సప్తఋషులుగా వర్ణింపబడే పంచ జ్ఞానేంద్రియాలతోను, మనోబుద్ధులతోను మాకు ఏ ఏ పదార్థాల, కర్మల జ్ఞానం

కలుగుచున్నదో ఆ పదార్థాలన్నీ నీ కృపవలన మాకు శాంతిదాయకములే అగును గాక. అవన్నీ మాకు సుఖశాంతులను కలిగించును గాక. నీ భక్తులము, నీ ఆజ్ఞాపాలకులమైన మేము భయరహితుల మగుదుము గాక.

May all the alleviations and their means what so ever in this world are known by the seven cognitive organs of the body be the source of peace and happiness for me. May there be happiness for me and there be security for me.

<u>వైజ్ఞానికి వివరణ</u> :- పూర్వ 12 వ మంత్రంలోను, ఈ మంత్రంలోను సప్త ఋషయః పదము రెండు పర్యాయాలు వచ్చింది. **'ఋషిః దర్శనాత్'** అని చెప్పినట్లు సామాన్యంగా వేద మంత్రార్థద్రష్టలను ఋషులంటారు. జ్ఞానేంద్రియాలు మనస్సు బుద్ధికూడా మనకు ప్రపంచ పదార్థాలను దర్శింప చేస్తాయి. కనుక, వాటిని కూడా ఋషులని పేర్కొంటుంది వేదం. **"సప్త ఋషయః ప్రతిహితాః శరీరే సప్త రక్షన్తి సదమ ప్రమాదమ్** - యజుర్వేదం (34-55) - శరీరంలో ఏడుగురు ఋషులు ప్రతిష్ఠింప బడ్డారు. ఆ సప్త ఋషులు అప్రమత్తులై శరీరాన్ని రక్షిస్తున్నారు" అంటుంది యజుర్వేదం.

**ఓం పృథివీ శాన్తి రన్తరిక్షం శాన్తిర్ ద్యౌః శాన్తిరాపః**
**శాంతి రోషధయః శాన్తి ర్వనస్పతయః**
**శాన్తి ర్విశ్వే మే దేవాః శాన్తిః**
**సర్వే మే దేవాః శాన్తిః శాన్తిః శాన్తిః శాన్తిభిః ।**
**తాభిః శాన్తిభిః సర్వ శాన్తిభిః శమయా౭మోహం**
**యదిహ ఘోరం యదిహ క్రూరం యదిహ పాపం**
**తచ్ఛాన్తం తచ్ఛివం సర్వమేవ శమస్తు నః ॥ .... (14)**

<u>వాక్యార్థం</u> :- <u>పృథివీ శాన్తిః + అంతరిక్షం శాన్తిః + ద్యౌః శాన్తిః</u> = హే సర్వసంరక్షక పరమేశ్వరా! నీ కృపవలన పృథివీ అంతరిక్ష ద్యులోకములు మూడును మాకు శాన్తి నిచ్చునవి అగును గాక.

<u>అపః శాన్తిః + ఓషదయః శాన్తిః + వనస్పతయః శాన్తిః</u> = భూమిపై నున్న జలము ఓషధులు (కాయ పప్పు ధాన్యాలు), వనస్పతులు (పెద్ద వృక్షాలు) సుఖ శాంతుల నిచ్చును గాక !

<u>విశ్వే మే దేవాః శాన్తిః</u> = సమస్త దేవతలు (విద్యావిజ్ఞాన వేత్తలు) మాకు శాంతి విద్యలను బోధింతురు గాక.

<u>సర్వే మే దేవాః శాన్తిః</u> = సమస్త ప్రాకృతిక దేవతలు శాంతి దాయకము లగునుగాక.

<u>శాన్తిః శాన్తిః శాన్తిభిః</u> = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖములన్నీ ఉపశమించును గాక.

<u>తాభిః శాన్తిః</u> = ఆ మూడు రకాల శాంతులును మాకు శాంతి దాయకములే అగును గాక.

<u>సర్వశాన్తిభిః</u> = అవి యివి అననేల సర్వము శాంతించును గాక.

<u>శమయా మోహం</u> = మా మోహరాగాలు శమించును గాక.

<u>యదిహ ఘోరం, యదిహ క్రూరం, యదిహ పాపం, తత్ + శాన్తం</u> = ఓ అంతర్యామివైన పరమేశ్వరా ! మాలో ఏవైతే అజ్ఞాన ఘోర క్రూర పాప భావనలున్నాయో వాటినన్నిటిని శమింప చేయుము - దహింప చేయుము.

<u>తత్ + శివం (తచ్ఛివం)</u> = వాటినన్నిటిని శివభావనలు చేయుము - నాకు, ఇతరులకు మేలు కలిగించే భావాలుగా మార్చుము. (లేకున్న కాలాంతరంలో అవి నాచే పాపకర్మలు చేయించును.)

<u>సర్వమ్ + ఏవ శమ్ + అస్తు నః</u> = అందువలన నిశ్చయంగా సర్వము మాకు సుఖశాంతులను చేకూర్చును గాక.

<u>సరళార్థం</u> :- ఓ శాంతిదాతా! సర్వేశ్వరా! నీ కృపవలన పృథివీ అంతరిక్ష ద్యులోకాలు మాకు శాంతి దాయకము లగును గాక! జల ఓషధీ వనస్పతులు మాకు శాంతి నిచ్చునవి యగును గాక! అవి యివి యననేల సమస్త జడ చేతన దేవతా గణములు మాకు శాంతిదాయకములే అగును గాక. శాంతికొరకు చేయు మా సర్వ ప్రయత్నాలు మాకు శాంతిని, ధైర్య సాహసాలను ఇచ్చునవి యగును గాక. ఆ శాంతి ప్రయత్నాలతో మేము సర్వవిధ శాంతులను బొందుదుము గాక. సర్వదా, సర్వథా, సర్వత్రా శాంతినే అనుభవింతుము గాక. అంతర్యామివైన ఓరక్షకా! మాలో ఏ అజ్ఞాన ఘోర భయంకర క్రూర పాపభావములున్నవో అవియన్నియు నీ కృపవలన శమించును గాక. మేము సదా పరోపకారాది సత్కార్యాలనే చేయుదుము గాక. శుభములనే పొందుదుము గాక.

May this earth be source of peace, may the mid region be peaceful, may the heavenly region be source of peace, may peace prevail in waters, may the herbs be peaceful, may the trees be source of happiness, may all the forces be peaceful for me and may all the wonderous and luminous objects be peaceful and pleasant for me. May the peace and prosperity itself be peaceful and constructive incorporated with peace and tranquility. May these peace and happiness and the means of peace and auspiciousness make me peaceful and tranquil. Whatever is terrific in this world, whatever is cruel in this world, whatever is impious be made 'Shant' (mended or ended) and turned to be auspicious. May every thing be auspicious for us.

వైజ్ఞానిక వివరణ :- చివరగా ఈ మంత్రంలో త్రిలోకాలలో ఉండే జడ చేతన దేవతలు మాకు శాంతిని కలిగించేవే కావాలని ప్రార్థించబడింది. దానితో బాటు మన కష్టాలకు నష్టాలకు బాధలకు చాలా వరకు మనలోని మోహరాగాలు, ద్వేష మద మాత్సర్యాలకు చెందిన సంస్కారాలు, ఆలోచనలే కారణంగా ఉంటాయి. అవి నశింప చేసుకోకుంటే కాలాంతరంలో అవి మనచే ఘోర క్రూర పాపాలను చేయిస్తాయి. అశాంతి, ఆందోళనలను కలిగిస్తాయి. ఆ సంస్కారాలను నశింప చేసుకోవాలంటే మనం ప్రయత్నపూర్వకంగా యోగాభ్యాసం - ముఖ్యంగా ధ్యానసాధన చెయ్యాలి. గాయత్రీ జపం అర్థభావనతో చేస్తే చక్కటి ఫలితం ఉంటుంది. పరమేశ్వరుని భర్గః జ్యోతిని - సకల క్లేశనాశక తేజస్సును ధారణ ధ్యానములు చెయ్యాలి. నా పాప సంస్కారాలన్నిటిని దహింప చేయుమని అంతర్యామిని మనసారా ప్రార్థించాలి. అస్తు. అట్లే చేయుదము గాక.

'సర్వమేవ శమస్తునః'

ఓం శాంతిః శాంతిః శాంతిః!

- సుమ్మార్థి

(డా|| కోడూరి సుబ్బారావు)



# శాంతి సూక్తము

(అథర్వణవేదము కాం. 19. అను 1. సూ. 9)

ఓం శాన్తా ద్యౌః శాన్తా పృథివీ శాన్త మిదముర్వ౽న్తరిక్షమ్ ।
శాన్తా ఉదన్వతీరాపః శాన్తా నః సన్త్వోషధీః ॥ ..... (1)

ఓం శాన్తాని పూర్వరూపాణి శాన్తం నో అస్తు కృతాకృతమ్ ।
శాన్తం భూతం చ భవ్యం చ సర్వమేవ శమస్తు నః ॥ ..... (2)

ఓం ఇయం యా పరమేష్ఠినీ వాగ్దేవీ బ్రహ్మసంశితా ।
య యైవ ససృజే ఘోరం తయైవ శాన్తిరస్తు నః ॥ ..... (3)

ఓం ఇదం యత్ పరమేష్ఠినం మనో వాం బ్రహ్మసంశితమ్ ।
యేనైవ ససృజే ఘోరం తేనైవ శాన్తిరస్తు నః ॥ ..... (4)

ఓం ఇమాని యాని పఞ్చేన్ద్రియాణి మనః షష్ఠాని
మే హృది బ్రహ్మణా సంశితాని ।
యైరేవ ససృజే ఘోరం తైరేవ శాన్తిరస్తు నః ॥ ..... (5)

ఓం శం నో మిత్రః శం వరుణః శం విష్ణుః శం ప్రజాపతిః ।
శం న ఇన్ద్రో బృహస్పతిః శం నో భవత్వర్యమా ॥ ..... (6)

ఓం శం నో మిత్రః శం వరుణః శం వివస్వాఞ్ఛ మన్తకః ।
ఉత్పాతాః పార్థివాన్తరిక్షాః శం నో దివిచరా గ్రహాః ॥ ..... (7)

ఓం శం నో భూమిర్వేప్యమానా శముల్కా నిర్హతం చ యత్ ।
శం గావో లోహిత క్షీరాః శం భూమిరవ తీర్యతీః ॥ ..... (8)

ఓం నక్షత్ర ముల్కాభిహతం శమస్తు నః, శం నోఽభిచారాః
శము సన్తు కృత్యాః ।
శం నో నిఖాతా వల్గాః శముల్కా దేశోపసర్గాః
శము నో భవంతు ॥ ..... (9)

ఓం శం నో గ్రహాశ్చాన్ద్రమసాః శమాదిత్యశ్చ రాహుణా ।
శం నో మృత్యు ర్ధూమకేతుః శం రుద్రాస్తిగ్మ తేజసః ॥ ..... (10)

ఓం శం రుద్రాః శం వసవః శమాదిత్యాః శమగ్నయః ।
శం నో మహర్షయో దేవాః శం దేవాః శం బృహస్పతిః ॥ ..... (11)

ఓం బ్రహ్మ ప్రజాపతిర్ధాతా లోకా వేదాః
సప్త ఋషయోఽగ్నయః ।
తైర్మే కృతం స్వస్త్యయనమిన్ద్రో మే శర్మ యచ్ఛతు
బ్రహ్మ మే శర్మ యచ్ఛతు ।
విశ్వే మే దేవాః శర్మ యచ్ఛన్తు, సర్వే మే దేవాః శర్మ యచ్ఛన్తు ॥ ... (12)

ఓం యాని కాని చిచ్ఛాన్తాని లోకే సప్తఋషయో విదుః ।
సర్వాణి శం భవన్తు మే శం మే అస్త్వభయం మే అస్తు ॥ ..... (13)

ఓం పృథివీ శాన్తి రన్తరిక్షం శాన్తిర్ ద్యౌః శాన్తిరాపః
శాంతి రోషధయః శాన్తి ర్వనస్పతయః
శాన్తి ర్విశ్వే మే దేవాః శాన్తిః
సర్వే మే దేవాః శాన్తిః శాన్తిః శాన్తిః శాన్తిభిః ।
తాభిః శాన్తిభిః సర్వ శాన్తిభిః శమయాఽమోహం
యదిహ ఘోరం యదిహ క్రూరం యదిహ పాపం
తచ్ఛాన్తం తచ్ఛివం సర్వమేవ శమస్తు నః ॥ ..... (14)






# ఈశ్వర స్వరూపం

ఓం త్వమింద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః ।

విశ్వకర్మా విశ్వదేవో మహాన్ అసి ॥

– ఋగ్వేదము (8-98-2)

ఈశ్వరుడు అభిభూః – విశ్వమంతట లోపల బయట వ్యాపించి యున్నాడు. అతడే సూర్య చంద్ర నక్షత్రాలకు ప్రకాశకుడు. ఆయన విశ్వకర్మ – సృష్టికర్త. అతడే దేవదేవుడు మహాదేవుడు.

O Lord, Thou art omnipresent, the lustre of the sun is your making. Though hast created every object.




# VEDIC SHANTHI PRAYER

ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతి,
రాపః శాంతిః ఓషధయః శాంతిః వనస్పతయః శాంతిః ।
విశ్వేదేవాః శాంతిః బ్రహ్మశాంతిః సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిః సా మా శాంతి రేధి ॥

– యజుర్వేదం (36-17)

ద్యు లోకము, అంతరిక్షము, భూమి జలము ఓషధులు, వనస్పతులు ఎల్ల విద్వాంసులు, వేదము, సంపూర్ణ ప్రపంచము, స్వయముగా శాంతియై శాన్తి నిచ్చుగాక! ఆ శాంతి నన్ను చేరి వర్ధిల్లు గాక!

May sky be peaceful. May atmosphere be peaceful. May Earth be peaceful. May waters be peaceful. May medicinal herbs be peaceful. May plants be peaceful. May all the learned persons be peaceful. May God and the Vedas be peaceful. May all the objects be peaceful. May peace itself be peaceful. May that peace come unto me.

Published by :

**ARYA SAMAJ - SEETHAPHALMANDI**

Main Road, Seethaphalmandi,
Secunderabad - 500 061.